1438

Reg. No. 757

# అభినవసరస్వతి

యను నొక మాసపత్రిక.

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు

జానపాటి పట్టాభిరామశాస్త్రిచే

ప్రచురింపఁబడుచున్నది.

జానపాడు.

1929

సంపుటము 21 | 1929 సం॥ ఆగస్టు నెల | సంచిక 5

## విషయములు.




చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 3 0 0

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

## ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, కందూరు.
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, కమలాపురం.
౩ బాకరాజు పరాంకుశరావుదేశాయిగారు. యాడవరం.
౪ రామసింగుగారు - నెల్లుట్ల.
౫ ఇనిగెల వెంకటధర్మారెడ్డి సర్దేశముఖుగారు - ఆత్మకూరు

## పోషకులు.

౧ రాజా వెంకటాద్ర్యప్పారావు, బహదరు జమీందారుగారు-నూజవీడు.
౨ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానుకోండూరు
౩ జాగర్లమూడి కుప్పుస్వామినాయఁడుగారు, కారంచేడు
౪ నెల్లుట్ల నరసింహారావుగారు, జనగాం
౫ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము
౬ రంగాచార్యులుగారు, ముక్త్యారు, దేశముఖు, మసీదుపల్లె.
౭ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౮ రామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.
౯ తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.
౧౦ టి. లక్ష్మణసింగుగారు, జనగాం
౧౧ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లింగగి
౧౨ పిశుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౩ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు, దుగ్గందూరు.
౧౪ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, ఆరుమూరు.
౧౫ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం
౧౬ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురం,
౧౭ రాజా కందుకూరు సూర్యప్రకాశరావు బహద్దరు, జమీందారుగారు-దేవిడి.
౧౮ సాకుంట శివరాజురావు దేశముఖ్ గారు, జగిత్యాల.
౧౯ శ్రీనువ్వెంకట శేషారెడ్డి రామచంద్రారెడ్డి దేశముఖుగార్లు, అల్లాదుర్గసంస్థా
౨౦ పరకాల వెంకటేశ్వరరావుగారు. పరకాల
౨౧ నుండ చిన వెంకయ్యగారు, దండమూడి.

## సహాయులు

౧ కారుమాను హనుమయ్యగారు, నరసారావుపేట
౨ మెదక్ శివరాజురావు దేశముఖుగారు, నల్లపల్లి
౩ బీరకాయల హనుమంతరావు దేశపాండ్యాగారు, రాయగిరి
౪ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి
౫ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, పాపురం.
౬ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౭ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౮ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల

4 - SEP 1929

# అభినవసరస్వతి


పుటము ౨౧ { జానపాడు శుక్ల సం॥ శ్రావణమాసము. } సంచిక ౫


## —* కాంగ్రెసు - మతము *—

—;o·—

ఈ కాంగ్రెసు తనపద్ధతుల నింకను విసర్జింపలేదు. ఎట్లన, దాని సచివ్యాపారాకవర్గము ఢిల్లీపట్టణమునఁగూడి శారదాగారి యువతీ ...హాశాసనమునకుఁ బ్రజలను బ్రోత్సహించుచు నొక తీర్పుఁ ...ంచియుండెను స్వరాజ్యపక్షనాయకుఁడగు మోతీలాలు నెహ్రూ, ...రాజ్యమున దొరతనమువారి శాసనసభలకు మతమును శాసించు ...కార మవశ్యము నుండవలయునని లిఖించియున్నాఁడు. మఱియు తని నివేదిక (రిపోర్టు) యందు దేవాలయములు, కూపములు, ...ములు మున్నగునవన్నియుఁ బంచములకుఁగూడ నుపయోగ ...లెనని నిర్బంధించియున్నాఁడు. ఈతని సూచననే జాతీయ ...మండలి సర్వపక్షములవారును నంగీకరించుచున్నారు.

...నాగ... మొన్న బొంబైనగరమున సమావేశమయిన జాతీయ ...ప్రభులు, దేశమునందెల్లఁ దీవ్రతరప్రచార మొనరించుటకును, ... నశింపఁజేయుటకును, మాలవియ్యాను, జమునాలాలు
Print
and publishe ...గించియున్నారు.

Ja ...భకు సంగములగు రాష్ట్రసభలుకూడ జాతీయ
author of ...వనే ద్రొక్కుచున్నవి. వంగరాష్ట్ర రాజకీయ



...ర్మాలముఁ జేయవలెనని యొక నిర్ణయముఁ

గావించియున్నది. ప్రియాగ మొదలగు భాగములకు సంబంధించిన సంయుక్తరాష్ట్ర రాజకీయసభయు నార్థికవిప్లవము మాత్రమే కాక, సాంఘికవిప్లవముగూడ సాధింపఁబడుఁగాక యని సంకల్పించినది; భూమి, ధనము, మున్నగు వానివలనఁగలుగు తారతమ్యమును, వర్ణాశ్రమములవలనఁగలుగు తారతమ్యమును, లేకుండఁజేయుటయే భావము.

మఱియు నాయకులు పురపాలక సంఘాదులందుఁ బ్రవేశించి కూపాదులనెల్లఁ బంచమస్పర్శదూషితము లగునట్లొనరించుచున్నారు. విద్యాసంఘములందుఁ జేరి బ్రాహ్మణాదిజాతుల నడఁగఁ ద్రొక్కి, పంచమాదులకుఁ బ్రేమ మీఱ ద్రవ్యమపేక్షింపకయే దుర్బోధలొసంగుచుఁ, బంచమప్రవేశము నెల్లని పాఠశాలలనుండి దొరతనమువారి ద్రవ్యమును దూరముఁజేయుచున్నారు. బొంబే యందలి పాఠశాలయందు జలపానమునకై భిన్నపాత్రలను వాడు నాచారమును, ద్రోసివైచి, బ్రాహ్మణ విద్యార్థులును బంచమవిద్యార్థులును నేకపాత్రలనే యుపయోగించుకొనవలెనని శాసింపఁగోరుచున్నారు. ఇట్టి యపాత్రుల వల్లనా మనకు స్వరాజ్యము సిద్ధించుట ? మఱియుఁ జిరకాల మనుభవింపఁబడుచున్న నూతులను మట్టితోఁ బూడ్చివేయించి, దివాకీర్తికరస్పృష్టంబు నగదంకారకరాస్పృష్టంబు నగు జలంబునే జనులందఱు సేవించుటకై ప్రయత్నించుచున్నారు. పూర్వకాలమునఁ గూపాది నిర్మాణ మొకపుణ్యము; మనయభినవ శకమునందో, విద్యమానకూపాదివిధ్వంసనమే పుణ్యకార్యము !

చాణక్యుని రాజనీతిశాస్త్రమునం దీశ్లోకము చూపట్టుచున్నది:—

శ్లో॥ "అనాయకా వినశ్యన్తి, నశ్యన్తి బహునాయకాః।
స్త్రీనాయకా వినశ్యన్తి, నశ్యన్తి శిశునాయకాః॥"

దీని తాత్పర్యమేమనఁగా:— నాయకులు లేనిప్రజలు నశింపఁగలరు. పెక్కండ్రు నాయకులుగాఁ గలవారును నశింతురు. వనితలు నాయికలయిన వారును నాశమొందెదరు. బాలురను నాయకులనుగా స్వీకరించిన వారును నాశమునొందఁగలరు.

మన మహాత్ములు చూపిన మార్గము నవలంబించినయెడల దేశ మీశ్లోకమునఁ దెల్పఁబడిన గతినే యనుభవించును. ఈగణము లోని యొక్కదోషము కలిగియున్నను గీడు తప్పదు; సకలదోష సంనిపాతమునందుఁ జెప్ప నవసరమా? ఇప్పుడు మనదేశమున కివి యన్నియుఁ బట్టియున్నవి. చూడుఁడు. దుష్టనాయకత్వమే యనాయకత్వముగాఁ బరిణమించి, యరాజకమునకుఁ గారణమగును; బొంబే కలకత్తా మొదలగు పట్టణములందలి వీధులందు జరుగుచున్న దుండగములను దిలకించినయెడల, నిది వ్యక్తము కాఁగలదు. అక్కడఁ బ్రజలను గాపాడుచున్నవి ప్రభుత్వమువారి సేనలుగాని, గాంధి సర్కారుయొక్క స్వచ్ఛందభటుల మూఁకలు కావు. రెండవది బహునాయకత్వము. ప్రజాప్రభుత్వము (డెమోక్రసీ) అనఁబడుచున్న దేయిది; ఒకనాయకుఁడు దేశము నుత్తరధ్రువమునకు లాగుచుండ, మఱియొకఁడు దక్షిణధ్రువమునకు లాగుచుండును; దొరతనమువారి శాసనసభలకుఁ గొందఱును నీవలికిఁ గొందఱును నాకర్షించుచున్నారు. ఇట్టి చిత్రములు జాతీయ మహాసభారంగమునఁ బదినిముసములయిన నిలచినవారికిఁ బ్రత్యక్షమయ్యెడిని. ఓహో! ఇట్టి యవ్యవస్థిత చిత్తులా మతమును సంస్కరించువారు? మూఁడవది స్త్రీనాయకత్వము. జాతీయ సభామంటపమున నిలసిల్లుచప లేక్షణలవీక్షించిన వారికిని బతాకోత్సవాదులందు గోలాహల మొనరించు మదవతుల నవలోకించిన వారికిని, గృహమును విడిచి దేశములఁ గ్రుమ్మరుచు నుపన్యాసాదికముచేఁ దమప రోపకారపారీణతను బ్రదర్శించుమహిళామతల్లులఁ బరికించినవారికిని,

స్త్రీనాయకత్వమన నెయ్యదియో బోధపడఁగలదు. చరమము బాల నాయకత్వము; చరమదశ నిక్కువము. పాశ్చాత్యదేశములందుఁ బాయికముగా లోకానుభవముగల వృద్ధులే యిప్పటికిని నాయకులుగా స్వీకరింపఁబడుచుండ, మన దేశమునం దహంభావైకవృద్ధులగు యువకులే పెద్దలతలలను దన్ని నాయకాగ్రేసరు లగుచున్నారు. క్లిమెన్సియో, పోయిన్‌కేయురు, మున్నగు వృద్ధులు ఫ్రాంసుదేశమునకును, హీండెన్బర్గు మొదలయినవారు జర్మనీదేశమునకును, లార్డు బాల్ఫరులోనగువారు బ్రిటీషుదేశమునకును, బనికివచ్చిరి; గాని మన దేశమునకుమాత్రి మట్టివయస్సుగలవారు తగినవారు కారు! ఇక్కడ నపరప్రహ్లాదు లవతరించుచున్నారు. వారెద్ది యుద్గారించిన, నదియే మనకందఱకును మహాప్రసాదము! వారికిఁ జదువుతోఁ బనిలేదు; సంధ్యయక్కఱలేదు. పాఁజదువుగలవారిని శిక్షించుటయే వారి చదువు; ఆతతాయిమహామన్త్రానుష్ఠానమే సంధ్య!

మఱియుఁ బాపభీతియు భగవద్భక్తియుఁ గల్గి గృహానురక్తితో శోభిల్లుచు హాయిగాఁ గాలక్షేపమొనరించుచున్న పనివాండ్రహృదయ క్షేత్రములం దసూయాది పాపబీజములను జల్లి యసంతుష్టి నుద్భవింపఁజేసి కార్మికసంఘముల నిర్మించి స్వామిద్రోహమును గృషి వాణిజ్యాదివినాశమును గావించుచు నితరుల ధనమానప్రాణములకుఁ గూడ హానిఁగలుగఁజేయుచున్నట్టియుఁ, గులస్త్రీలకుఁ గులటాధర్మంబు లుపదేశించి పురుషద్వేషమును బురికొల్పి సంఘముపై దండెత్తించుచున్నట్టియు, బాలురకుఁ బ్రాచీనులయం దవజ్ఞను బుట్టించి యవినయమును బెంపొందించి యకార్యకార్యములకు సంనద్ధులఁ జేయుచున్నట్టియు, నపూర్వనాయకుల చర్యలను సవిస్తరముగా నిరూపించుట కిట నవకాశములేదు. హనుమంతునివలన స్వామిభక్తియు, సీతనుండి పతిభక్తియు, రామునిఁబట్టి గురుభక్తియు గ్రహించుచు

నైహికాముష్మికసుఖంబు లనుభవింపవలసిన భరతఖండంబు నేఁడు మహామోహుని మాయలకుఁ జిక్కి మహాపాతకప్రీతితో మహాప్రళయంబున కభిముఖం బగుచున్నదికదా.

మీకు స్వరాజ్యాపేక్ష లేదా యని ప్రశ్నించి యపూర్వజాతీయవాదులు సనాతనమతావలంబులను దేశద్రోహులఁగ దూషించుచుందురు. కాని, రష్యాయందు లెనినుగారి జాతీయతయెట్టిదో, టర్కీయందుఁ గెమాలుపాగారి జాతీయతయెట్టిదో, యాఫ్గనుస్థానమున నమనుల్లాఖానుగారి జాతీయత యెట్టిదో, మనదేశమున నవాచారవాయుప్రచారకుల జాతీయతయు నట్టిదే! ఆత్మప్రధానము; అక్కడ భాసింపవలెను జాతి! ఆత్మ పూర్ణముగా స్వజాతికి విరుద్ధమయి నప్పుడుఁ, గేవల పటాటోపమా జాతీయత? మఱియు, స్వరాజ్యము వైదిక మతస్థులకును సమ్మతమే కాని, దాని నిర్వచనమునందు వారికిని వీరికిని భేదము; ఉపాయమునందును భేదమే. స్వరాజ్యము మాట దేవుఁడెఱుంగును; మమ్ముల నున్నరీతిగా బ్రతుక నిచ్చినఁజాలునని వైదికులు భావించిన, నాశ్చర్యమేమి?

మనకు రాజ్యముపోయినను, సర్వమును బోలేదు; కొన్ని విషయములందు మనకు స్వాతంత్ర్యమింకను మిగిలియే యున్నది. కాని, యిప్పుడు మన యవ్యక్తప్రధానులు కొందఱు రజస్వలా వివాహాది నిర్బంధములచే, దానినిఁగూడఁ బోఁగొట్టనెంచుచున్నారు. మఱియుఁ బ్రభుత్వము గతించినను, మతమయినను నించుక శేషించియున్నది; అదిగూడఁ బాడుచేయుటకై మన కుమతులు ప్రయత్నించుచున్నారు. వీరు సమర్థులేయైనచోఁ, బోయినదిరాఁబట్టుకొనవలెను, గాని యున్నది గూడఁబోఁగొట్టుకొనుట యేటి రాజనీతి?

కావున, నో యార్యులారా! ఇట్టి విపరీతబుద్ధులుఁ గతినాత్ములు నయిన యభినవాభినయదక్షుల మాటలను నమ్మి మీర లాపదలపా

లగుటకు నిష్టపడుచున్నవారా? లేక, సర్వజ్ఞులు తపోమయులునయిన పూర్వాచార్యుల సుభాషితములను విశ్వసించి విశేషశుభంబు లనుభవించుటకు నిశ్చయించినవారా ? పాపము శాంతించుగాక !

---

# కర్నూలు మహాసభ.

—:o:—

శుక్లనామ సంవత్సర ఆషాఢ శు॥ ౪ లు బుధవారమునకు సరియైన 10-7-29 తేదిలు కర్నూలుపేట శ్రీయుత కీర్తిశేషులైన ఇటిక్యాల కృష్ణస్వామి శ్రేష్ఠిగారి సత్రములో అనేక బ్రాహ్మణులు, వైశ్యులు, రెడ్డిగారు, వీరశైవులు (లింగాయితులు) మహారాష్ట్రులు నేతనేయువారు అధికసంఖ్యాకులు సమావేశమై శ్రీయుత వేదమూర్తు లగు బ్రహ్మశ్రీ మతము గురురాజాచార్లుగారి యధ్యక్షతక్రింద ప్రకృతము శాసనసభలలో సెలక్టు కమిటీవారు వివాహచట్టములపైన సూచించిన అంశములు చర్చించిరి.

దైవప్రార్థన గావించినపిదప కర్నూలు పుల్లాపంతుల రామచంద్రయ్యగారు అధ్యక్షుని యెన్నుకొనుటలో ప్రకృతము మన కర్తవ్యము సూచించిరి. పిదప సభవారందరు యేకగ్రీవముగ అధ్యక్షులను యెన్నుకొనినపిదప విషయముల చర్చించి, పిదప నీక్రింది తీర్మానములు సభలో ప్రవేశపెట్టబడి, సభవారందరివల్ల యేకగ్రీవముగ అంగీకరింపబడినవి.

1 వ తీర్మానము:—ఢిల్లీ శాసనసభలో తీర్మానమునకు తెచ్చిన శ్రీ శారదాగారి బాలికావివాహనిషేధ, పునస్సంధాన వయోనిర్ణయ సంఘములవారి సూచనలు ఏవిగాని హిందూమతాచారమునకును, సనాతనధర్మములకును, కేవలము విరుద్ధముగ నున్నందున, ఈసభవారు అవి సర్వదా యనంగీకారములని తీర్మానించుచున్నారు.

2 వ తీర్మానము:- ఇట్టి తీర్మానములు, భారతసోదర ప్రతినిధులమని కొందరు సభ్యులు ఇప్పుడుగాని మరెప్పుడుగాని చట్టనిర్మాణసభలలో చర్చించరాదనియు, ప్రభుత్వము వారెన్నటికిగాని చర్చించనవకాశ మియ్యరాదనియు, నంగీకరింపరాదనియు తీర్మానించుచున్నారు.

మరము గురురాజాచార్లు,
అధ్యక్షులు.

---

# ఓట్లు, ఓట్లు

వర్ణాశ్రమధర్మపరాయణులారా !

లెండు. మేలుకొనుఁడు. ఓట్లిచ్చుకాలము వచ్చినది. మనగతి యధోగతియగుచున్నది. ఇప్పటికైనను దెలివిదెచ్చుకొనుఁడు. మన నిద్ర కుంభకర్ణుని నిద్రనుగూడ మించినదని యీవలకే కొందఱు పెద్దలు యోగ్యతాపత్రిక లిచ్చియున్నారు. లెండు! ఊఁకొట్టుఁడు! చూడుఁడు! నలుగడల గమనింపుఁడు! అదిగో ఆమూలనుండి బ్రహ్మ సమాజము బయలుదేరి ధర్మశాస్త్ర విహితంబులగు మనజుట్టు బొట్టు కట్టులను దుడిచిపెట్టి పాశ్చాత్య వేషభాషాదులను మనలో నెలకొల్పఁ బాటుపడుచున్నది. ఇదుగో! యీవైపునుండి ఆర్యసమాజము బయలుదేరి వేదశాస్త్రములే వాకుఁ బ్రమాణంబులని చెప్పుచు ధర్మశాస్త్ర విరోధంబుగా సర్వజాతులవారికి జుట్టుబొట్టుకట్టులతోఁ బాటు యజ్ఞోపవీతధారణాదులను గూడఁ గూర్చుచున్నది. అదిగో! ఆచెంప నుండి దివ్యజ్ఞాన సమాజమువారు నిర్గమించి కపటోక్తులను బలుకుచు శ్రుతిస్మృతి విరుద్ధంబుగాఁ బ్రవర్తించుచున్న వారు. ఇదుగో యీదెస

నుండి రాజకీయధురంధరులము, మహాత్ములము, దేశభక్తులము, దేశోద్ధారకులము, కాంగ్రెసువారము, స్వరాజ్యవాదులము, అని యేవేవియో పేరులంబెట్టికొని వెడలి సనాతనధర్మనిర్మూలనం బొనరించుపను లనేకంబులఁ గావించిరి. ఇతరులకు బోధించిరి. పాపభీతి నడుగంటఁ జేసిరి. ఈపైనఁజెప్పిన యార్యబ్రహ్మాదివ్యజ్ఞాన సామాజికులందఱు శ్రుతిస్మృతిబోధితవర్ణాశ్రమ ధర్మాచారములందు శ్రద్ధగలిగి సాధ్యమైనంతవఱకు ననుష్ఠించుచు సుఖపడు మనలఁజూచి సహింపలేక దండెత్తియున్నారు. దండెత్తనిండు. మన కేమియు భయములేదు. వేద శాస్త్రంబులున్నంతవఱకు మన కెంత మాత్రమును భీతి లేదని గట్టిగా నమ్ముడు. కాని యుక్తాయుక్తంబులను వీడి ధర్మశాస్త్రవిరోధులై తిరుగు పైవారి క్రూరకృత్యములకుఁ దగిన ప్రతిక్రియఁ జేయవలసియున్నది. ఇందు మన మెంతమాత్రము శ్రద్ధజూపుటలేదు. కాని ఇప్పుడిప్పుడు కాశీపండిత సభయు, మదరాసు, కుంభకోణ, తంజాపూరు, విజయవాటి కాదిసభలును బయలుదేరి సంఘసంస్కారుల యొక్క దుర్వాదములను శ్రుతిస్మృతిహేతుప్రమాణపురస్సరంబుగా ఖండించుచున్నది. ఇప్పుడిప్పుడే అవధాని శిరోమణి కాశీకృష్ణాచార్యులు గారు కొందఱచేత మహాత్ముఁడని పిలువఁబడు శ్రీగాంధిగారిని మత విషయములలో నెదుర్కొనినది. మొన్న మొన్ననే పాలగుమ్మి పండితసభవారు శ్రుతిస్మృతి విరుద్ధవాదం బొనరించు శ్రీగణపతి శాస్త్రిగారిని దిరస్కరించినది. ఇటీవలనే మదరాసులో 1927 వ సం॥ కాంగ్రెసు జరిగినప్పు డఖిలభారత వర్ణాశ్రమధర్మ సభవారు వేదశాస్త్ర విరుద్ధబోధల నొనరించు మదన మోహనమాలవ్యా, గణపతి శాస్త్రిగార్లను బ్రితికా పూర్వకముగా నాహ్వానించి యెదుర్కొని పలాయితులఁ గావించినది. ఈనడుమనే శికిందాబాదు పండితులు శ్రుతిస్మృతి విరుద్ధబోధల నొనరించు శ్రీకాశీనాథుని నాగేశ్వర

రావు, రాయప్రోలు సుబ్బారావు, స. సూ. శాస్త్రిగార్ల నెదుర్కొని
నిరుత్తరులను గావించినది. ఇంకనిట్లే శ్రీమల్లాది రామకృష్ణ విద్వ
చ్ఛయనులవారు, ఆమ్నాయార్థ వాచస్పతి వడలి లక్ష్మీనారాయణ
శాస్త్రిగారు, కొంపల్లి సుబ్బారాయశాస్త్రిగారు, పుల్య ఉమామహే
శ్వర శాస్త్రిగారు బ్రహ్మయ్య శాస్త్రి గారు, ప్రభలలక్ష్మీనరసింహం
బి. ఎ. బి ఎల్. గారు, హరి నాగభూషణం సంగీతవిద్వాక్ బి. ఎ.
గారు, మొదలగువారెందరో గొప్పవారును, శృతిధర్మసంజీవనీ
పత్రికాధిపతి అభినవసరస్వతియు, వైశ్య, బ్రాహ్మణ పత్రికలును,
స్వధర్మప్రకాశినీ పత్రికయు దుర్వాదములను ఖండించుచునే యున్నా
రు. కొందఱు సంఘసంస్కారులు శాసన సామ్రాజ్య సభలలోఁ జేరి
తమ మనోరథములను దీర్చికొనుటకై బిల్లులఁబెట్టుచున్నారు. వీరి కోరి
కలు కొన్ని నెరవేరినవి. దానివలన సంఘక్షోభము గలుగుచున్నది. ఇది
యిట్లుండ మనవలన వోట్లు లాగుకొని కృతార్థులైన శ్రీహరవిలాస
శారదాగారును, శ్రీగౌరుగారును, శ్రీముత్తు లక్ష్మియు, నిర్బంధ
పూర్వక వివాహగర్భాధాన శాసనంబులను బెట్టియున్నారు. వీనివలన
మనము కని మిక్కిలి ప్రేమతో గష్టనష్టముల కోర్చి పెంచి పెద్దఁజేసి
కొనిన మనపుత్రులకును, బుత్రికలకును, పెండ్లి మొదలగునవి స్వతం
త్రముగాఁ జేసికొనుటకు వీలులేదు సుమీ! వింటిరా? ఇంతకంటె
నన్యాయ మేమున్నది? మనము దేశోపకారులని వారిమాయమాటల
చే నమ్మి వోటులనిచ్చి శాసన సామ్రాజ్యసభలలోఁ గూర్చుండఁబెట్టి
గౌరవించి నందులకు వారుచేసిన ప్రత్యుపకారమిది. మనపిల్లలకు స్వ
తంత్రించి వివాహాదులం గావించితిమా—మనబంధువులతోడను,
బురోహితునితోడను, భజంత్రీలతోడను, పెండ్లిపెద్దలతోడను, చెఱ
సాల కేగవలసినదే. 1000 చొప్పున జరిమానా యియ్యవలసినదే.
చూచితిరా! ఇట్టి సంఘాపకారులకు ఓటు లియ్య

వచ్చునా? ఈ వచ్చునని యెంతమాత్రమేని తెలివియున్నవాఁడనఁగ లఁడా? అనఁడు. కాంగ్రెసు, స్వరాజ్యవాదు లీవర్ణసంకరకార్యంబుల లోఁ బ్రవేశించి ప్రోత్సహించుచు సంఘక్షోభము గలిగించుచున్నారు. కనుక వీరిని నమ్మఁగూడదు. శాసనసభ్యులవలన మన కెక్కువ హింసగలు గుచున్నది. మనవర్ణాశ్రమ ధర్మములను గాపాడుకొనవలసియున్నది. దానికిఁ దగినయుపాయములను విచారింపుఁడు అవియాచరణలోనఁ బెట్టుటకు మిమ్ముల నెక్కువగాఁ గోరుచున్నాను. ఆయుపాయములలో నొకటి యోట్లను గురించినదియై యున్నది. ఇది మన చేతులలో నున్న దియే. ఏమన, అభ్యర్థిగా నిలిచి యోటు గోరుచు మనదగ్గ రకు వచ్చినప్పుడు "వర్ణాశ్రమాచారధర్మములందు జోక్యము గలిగించు కొనను. సభ్యులలో నెవరైన జోక్యము కలిగించుకొనిన యెడల నెదిరిం చి పరిపూర్ణముగా వర్ణాశ్రమధర్మములను గాపాడఁగల"నని యెవఁడు ప్రమాణపత్రము వ్రాసియిచ్చునో వానికే మీ యోటునిండు. ఇతరులకు వలదు. ఇట్లే కాశీలోను, మదరాసులోను బెజవాడలోను వర్ణాశ్రమ ధర్మసభలు దీర్మానించినవి. కాన వారి తీర్మానమున ననుసరించి వర్ణాశ్రమ ధర్మనిరతుల మగుమనము మనవారికే యోటునిచ్చి గౌరవింపవలయునని వేఁడుచున్నాఁడను. మనకపకారమొనరించు కాంగ్రెసు, స్వరాజ్య, సంఘసంస్కార, బ్రహ్మోర్యదివ్యజ్ఞానసామాజికుల కెంతమాత్రము నోట్ల నీయవలదని ప్రార్థించుచున్నవాఁడను. ధర్మమును మనమురక్షించినచో నది మనలను రక్షింపఁగలదు. "ధర్మా న్న ప్రమదితవ్యం - ధర్మో జయతి."

—(:o:)—

# ఆంధ్రదేశ వర్ణాశ్రమధర్మమహాసభ.



ఈ సభ వైశాఖశుద్ధ తృతీయా చతుర్థులను బెజవాడలోఁ గావింపఁబడినది. విశాఖపట్టణవాస్తవ్యులును వైదికలౌకికవిద్యాప్రవీణులును, ఆస్తికశిఖామణులును వేదవేదార్థవేత్తలును వర్ణాశ్రమ ధర్మానుష్ఠాన తత్పరులును నగు ప్రభల లక్ష్మీనృసింహముగా రీసభ కగ్రాసనాధిపతులు. ఆహ్వానసంఘాధ్యక్షులు కవుతా సూర్యనారాయణరావుగారు. ఇప్పుడు లెజిస్లేటివు అసెంబ్లిలోఁ జర్చింపఁబడుచున్న హరవిలాసశారదాగారి వివాహశాసనము ఖండించుట యుఁక మీఁద శాసనసభలయందు వర్ణాశ్రమ ధర్మవిరుద్ధపు బిల్లులకుఁ బ్రవేశమీయఁగూడదని ప్రభుత్వమువారిని బ్రార్థించుట రాఁబోవు నెన్నికలలో మతాచారవిరుద్ధములగు బిల్లుల శాసన సభలయందుఁ బ్రవేశపెట్టమనియు నితరులు ప్రవేశపెట్టినచో వానిఁ ద్రోసివేయుటకుఁ బ్రయత్నించెదమనియుఁ బ్రమాణపత్రికల నిచ్చువారికి మాత్రమే తమ వోట్లు నీయవలయునని వోటరులకు బోధించుట నానాజాతిమతములకుఁ జేరిన భారతీయులుగల నేషనలు కాంగ్రెసు సంస్థయందు భారతీయమతాచారవిరుద్ధములగు తీర్మానములఁ జేయఁగూడదని కాంగ్రెసువారిని హెచ్చరించుట మున్నగు తీర్మానము లీసభయందుఁ జేయఁబడినవి. సుప్రసిద్ధ పండితులగు మల్లాది రామకృష్ణచయనులుగారు వడలి లక్ష్మీనారాయణశాస్త్రిగారు పుల్యాల ఉమామహేశ్వర శాస్త్రిగారు కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు మన్నగువా రనేకులు వర్ణాశ్రమ ధర్మములనుగూర్చి శాస్త్రయుక్త్యనుభవపూర్వకములగు నుపన్యాసములిచ్చిరి. వర్ణాశ్రమ ధర్మాభిమానులు పలుమంది దయచేసిరి. ఇంకను నీసభావిశేషము లాహ్వాన సంఘాధ్యక్షుల స్వాగత

సంభాషణమునఁ దెలియఁబడునుగాన నయ్యది దిగువఁ దింకింతురు గాక.

' ఆస్తికమహాశయులారా, వర్ణాశ్రమధర్మాభిమానులారా,
అధ్యక్షా, సోదరప్రతినిధులారా !

అఖిలభూమండల మండనాయమాన భరతఖండమునకు విల క్షణాధర్మమగు వర్ణాశ్రమ ధర్మమును సంరక్షింపదీక్షితులై యిట సమా వేశులైన పూజనీయులగు మీ శాహ్వానమొసంగుటకు నన్నీ సంఘము వారు నియమించుటచే నేనెంతయు కృతజ్ఞుడను.

ఈ మా పట్టణమిపుడు బెజవాడ యని పిలువబడుచున్నను ఇంతకుముందు విజయవాడ, బీజవాడ, జయవాటిక, కనకపురి మొద లగు నామములచే దెలియబడి నాల్గు యుగములనుండియు బ్రసిద్ధి నొందినదై యున్నది. సాక్షాద్విష్ణుతనువనబడు పావన కృష్ణామహానది ఈ పట్టణప్రాంతమున బ్రవహించుచు తన నిర్మలోదకములచే ప్రాణి కోటుల పునీతుల గావించుచున్నయది. ఈచెంతనున్న ఇంద్రకీలగిరి, మాధవవర్మయను ప్రభువుయొక్క న్యాయైకదృష్టికి మెచ్చి. చినుకుకు చిన్నము కనకము గురిపించి ఖ్యాతినిగన్న కనకదుర్గకును, మల్లయుద్ధ మున పాండవమధ్యమునకు విజయము నిచ్చి, మల్లేశ్వరుడని ఖ్యాతి నొందిన మహాదేవునకును స్థిరాసనమై యలరారుచున్నయది. ఇప్పటికి తెలుగుభాషలో దొరికిన శాసనములలో నెల్ల పురాతనమైన యుద్ధమల్లుని శాసన మీపట్టణమున శ్రీభ్రమరాంబా మల్లేశ్వరాలయమున నున్నది.

ఈ కొండపై నున్న కిరాతార్జున స్తంభము, దిగువనున్న యుద్ధ మల్లుని గొరగలపురము, కనకదుర్గాలయదక్షిణభాగముననున్న తూర్క రాజశాసనము, చింతామణిదుర్గము, నలుబదియారు శాసనశిలలతోనున్న జమ్మిదొడ్డిమంటపము, జగద్గురు శ్రీశంకరభగవత్పూజ్య పాదాచార్యుల

వారిదని వ్యవహారము గనుచున్న శ్రీరాజరాజేశ్వరీయంత్రము, ఇంద్రాద్రికి పశ్చిమమునయున్న నృసింహగుహ, ఇంతకు ముందు నగరేశ్వరాలయమనియు నిపుడు విజయేశ్వరాలయమనియు వ్యవహరింపబడు సిద్ధేంద్రయోగియనుచ ద్రయోగిచే యంత్రితమైనశివాలయము, విష్ణువర్ధనుని శివప్రతిష్ఠా శాసనము, శ్రీకృష్ణదేవరాయల ప్రశస్తి శాసన స్తంభము, యోగగుహ, అక్కన మాదనల భూరియన్నదానపు చావడులు, మొదలగునవి మాపట్టణముయొక్క పూర్వచారిత్రస్మారకములై యున్నవి.

ఇట్టి సుప్రసిద్ధ పుణ్యక్షేత్రమునకు, పుణ్యపురుషులు, పురుషధౌరేయులు, వర్ణాశ్రమ ధర్మాభిమానులు, నగు మీ రాకాహ్వాన మొసంగుట నాకెంతయు సంతసము. మే మిచ్చెడు నాతిథ్యాదికముల యందు, మాయాదరమునే గ్రహించి, లోపముల మన్నించవలయు నని ప్రార్థించుచున్నాడను.

" లోభమోహజుషాం యస్య తనుతానుదినం భవేత్ ।
యథాశాస్త్రం విహరతి స్వస్వకర్మసు సజ్జనః ॥ "

అని వసిష్ఠవచనము. కృష్ణానదీతీరమందు అర్జునుడు తపస్సు చేసి పాశుపతాస్త్రమును సంపాదించిన యీ యింద్రకీలాద్రియను మహాక్షేత్రంబున వర్ణాశ్రమధర్మములు రూపు మాయుచున్న యీ కలికాలమం దిచట వర్ణాశ్రమధర్మరక్షణమునకై సభకూడుట ఆంధ్ర దేశీయుల పూర్వతపః ఫలము. ఈసభను దయచేసిన సత్పురుషు లందరు యీ విజయవాడయందలి గ్రీష్మబాధకు సైరించి శ్రమచేసి దయచేసియుండుట తమకు వర్ణాశ్రమధర్మముల యందున్న శ్రద్ధను ప్రకటన చేయుచున్నది. వర్ణాశ్రమధర్మములే ప్రజలకు బాధకరములయి నాశము చెందించవలసినవే యైనచో నేడింతమంది జనము యీసభను జయప్రదముగ జరిగించుటకు కూడుదురా ?

బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రజాతులు నాలుగును, బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసములను నాలుగాశ్రమములును సృష్టికర్త యగు పరమేశ్వరునిచేత సృష్ట్యాదియందే ప్రజల సౌకర్యము, వృద్ధి, సుఖము కొరకై యేర్పాటుచేయబడినవిగాని మధ్యకాలమందుగాని ప్రజలనుపీడించుటకుగాని నిర్మించబడినవి గావు. ఇందుకు శ్రుతిస్మృతులే ప్రమాణములు. ఈవిషయము యీమధ్యకాలములో కాశీయందు జరిగిన శ్రీఅఖిలభారతవర్షీయ బ్రాహ్మణ మహాసభ యందు విపులముగ చర్చించబడెను. అది అంతయు యీ పండితసభయందు విశదీకరించబడును. " ఈ వర్ణాశ్రమధర్మములు యీ భరతవర్షమందే గాని యితర యేదేశములయందును లేవు ఇతర దేశీయులు సుఖముగ లేరా? వర్ణాశ్రమ వివక్ష లేకపోవుటచేతనే వారెక్కువ అభివృద్ధిని జెందుచున్నార"ని మనవారిలో కొందరు అభిప్రాయ పడుచున్నారు గాని అది వాస్తవదృష్టిగాదు. సుఖము తాత్కాలిక మనియు, స్థిర మనియు, రెండువిధములు. అందు తాత్కాలిక సుఖసంపాదనకై విశేషమయిన తెలివిగాని బుద్ధిసూక్ష్మతగాని, అవసరములేదు. ఇట్టిసుఖము మనుష్యులకును పశ్వాదులకును సమానమైయున్నది. 'పశ్వాదిభిశ్చ అవిశేషాత్' అని శ్రీ శంకర భగవత్పాదులు సూత్రభాష్యమందు నిర్వచించిరి. ఈసుఖమునే యిప్పుడు పాశ్చాత్యులును తద్బుద్ధి గలిగిన భరతవర్షీయులును కోరుచున్నారు. ఈయర్థమునే శ్రీకృష్ణమూర్తి యిప్పు డన్నిమతములవారును ఉత్తమగ్రంథముగ నెంచుచున్న గీతల యందు

" యేహి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః " ॥ అని చెప్పిరి.

ఇకస్థిరమై నిరతిశయమై బాహ్యసాధన నిరపేక్షమై పైదానికంటె విలక్షణమైన సుఖమును సంపాదించుకొనుటకును తత్సంపాదన సాధనములను తెలిసికొనుటకును ఆటపట్టయినదియే యీమనభరతవర్షము

" దేహం లబ్ధ్వా వివేకాఢ్యం ద్విజత్వంచ విశేషతః ।
తత్రాపి భారతే వర్షే కర్మభూమౌ సుదుర్లభం ॥ "

అని అధ్యాత్మ రామాయణమందు భరతవర్షముయొక్క ఆధిక్యత వర్ణింపబడెను. ప్రస్తుతము మనదేశమందలి వర్ణాశ్రమ ధర్మస్థితి షడ్భావ వికారములలో అయిదవ అవస్థయగు అపక్షయాకారమును జెందియున్నది. ఇప్పుడు దీనిని ఆరవదియగు వినాశావస్థను చెందకుండ భరతవర్షీయులు పాటుబడనియెడల వర్ణాశ్రమధర్మములు నశించిన సమకాలమందే మనదేశమునకుగూడ నాశము కలుగక తప్పదు. "ధర్మఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః" అను న్యాయము ననుసరించి వృద్ధికి హేతువు ధర్మము. నాశమునకు హేతువు అధర్మము. ధర్మమునగా వర్ణాశ్రమోచిత కర్మ. తదనుష్ఠానమే ధర్మానుష్ఠానము. అదియే అభ్యుదయ హేతువు. ప్రతిమనుజుడు స్వధర్మమును యథాశక్తి పరిపాలించినయెడల అచిరకాలములో దేశమునకు సుఖము, ఐశ్వర్యము కలుగును.

'స్వే స్వే కర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః। స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః' అని శ్రీకృష్ణమూర్తి నుడివిరి. పురుష ప్రయత్నము శాస్త్రీయమనియు ఉచ్ఛాస్త్రీయమనియు రెండువిధములు. ఇప్పుడు నేను దేశాభివృద్ధికై చెప్పినసాధనములు శాస్త్రీయమైనపురుషకారము, శీఘ్రఫలప్రదము.

'బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాంచ పరంతప కర్మాణి ప్రవిభక్తాని' యను గీతావచనమువలన నాలుగువర్ణములవారికిని భిన్నభిన్న ధర్మములు శాస్త్రమువల్లనే నిర్ణయింపబడినవి. అట్టినాలుగు వర్ణములలో తారతమ్యముగూడ శ్రీమద్భాగవతాది పురాణములయందు " బ్రాహ్మణో జన్మతశ్శ్రేయాన్ సర్వేషాం ప్రాణినామపి "

ఇత్యాది వచనములచే జెప్పబడియున్నది. పరాశరస్మృతియందును నాలుగువర్ణములవారికిని సమానధర్మములు అనగా సాధారణ ధర్మములు - అహింస, సత్యము, శౌచము, దయ మొదలగువానిని చెప్పి అసాధారణ ధర్మములు అనగా ఆయావర్ణములవారికిని, బ్రహ్మచర్యము మొదలయిన ఆశ్రమ ధర్మముల విశేషముగా చెప్పబడియున్నవి. 'ఉత్సన్నకుల ధర్మాణాం మనుష్యాణాం జనార్దన। నరకేనియతం వాసో భవతీత్యనుశుశ్రుమ' అను గీతావచనము కులధర్మత్యాగము నరకప్రాప్తికి కారణమని బోధించుచున్నది

శ్రు॥ 'ధర్మోవిశ్వస్య జగతః ప్రతిష్ఠా' అనుశ్రుతి లోకస్థితికి ధర్మము కారణమని చెప్పుచున్నది. అట్టి ధర్మముల ననుష్ఠించుటకును రక్షించుటకును వర్ణాశ్రమ వ్యవస్థలు కల్పించబడియున్నవి అట్టి వ్యవస్థ లేని యెడల సాంకర్యదోషమువలన ధర్మభ్రంశము, దానివలన లోకస్థితికి భంగము కలుగును. ఇంతియగాక లౌకిక వైదికములయిన సకల క్రియలును వ్యవస్థామూలముననే సమ్యగనుష్ఠితములయి ఫలజనకము లగుచున్నవి.

ఆంధ్రులు కొన్నివందల సంవత్సరముల క్రిందటివారని చరిత్రకారులు నిర్ణయించినదిసరిగాదు. త్రేతాయుగమందువాల్మీకిఋషి రచించిన మహారామాయణమందు ఆంధ్రశబ్దముగలదు: కనుక అప్పటికే ఆంధ్రులు సుప్రసిద్ధులుగ నుండినట్లు స్పష్టము; వీతహవ్యుడను నొక పురుషుడు జీవన్ముక్తినిపొందినట్లు వర్ణించి ఆయననుగురించి 'సప షోఽద్యస్థిత్రోఽన్ధ్రాణాం గ్రామే బహుళపాదపే,' అనియు మరియొక చోట 'ఆంధ్రద్రావిడ కాశ్మీర పారశీకపురేషుచ' అనివర్ణించిరి.

ఇప్పుడు మన ముపేక్షించినచో మనసంఘమునకు రానైయున్న ముప్పులను మీరెరిగియే యున్నారు. ఆసేతుహిమాచలపర్యంత మార్యావర్త మనేకవిధముల స్వాతంత్ర్యసంపాదనమునకై యత్నించు

చున్న యిక్కాలమున, అనాదినుండియు మన మనుభవించుచున్న స్వాతంత్ర్యమునకును హానిరానై యున్నది. ఇంతవర కేకాలమందు నిట్టి యిక్కట్టు లీభారతవర్షమున వచ్చినట్లు కనివిని యెరుగము.

ఏరాజేకాలమున నీ రాజ్యమేలినను, మనకు ప్రాణముకంటె నెక్కుడు ప్రేమపాత్రమైన ధర్మమునడ్డగించిన పాలకు లింతవర కెన్నడు నీభూమిని పాలించలేదు. ప్రకృతమున పాలించుప్రభువులును " మీ మీ ధర్మములను మీరే పాలించుకొనుడు. మేము జోక్యము కలిగించుకొనము. " అని వేవిధముల ప్రతిజ్ఞజేసియున్నారు.

కాని వారిటీవల, రాజ్యమునకు బాధ్యత నిచ్చుసంకల్పముతో నేర్పరచిన శాసనసభలలో జేరిన, విదేశీయభావపూరిత హృదయులగు వస్మద్దేశీయులు, మన కుపకారకరములను నెపముతో ప్రవేశపెట్టిన వివాహగర్భాధానవయోనిర్ణయశాసనములు, మొదలుగాగల శాసనములు, మన కనేకవిధముల ననర్థదాయకములని మనకు దెలిసియున్నను మనభావములు ప్రభువులకు బాగుగ శ్రుతములగుచున్నట్లు కనుపించుట లేదు.

అందుచేత నేయిట్టిసభ లవసరములైనవి. ఈసభలయందు సమర్థులగు మీరందరు ప్రకృతమున చర్చలోనున్న శాసనముల బాగోగులను విమర్శించి, "ప్రభుత్వమువా రిట్టి విషయములలో జోక్యముకలిగించుకొనుట అన్యాయము, అధర్మము, పూర్వప్రతిజ్ఞావిరుద్ధము" అని విన్నవించి, వెంటనే ఇట్టిశాసనముల ద్రోసివేయవలయుననియు ఇకముందెన్నడు నిట్టిశాసన ప్రవేశమునకే యవకాశము లివ్వకుండ వలయుననియు కోరవలయును.

ప్రజల కీవిషయములను బోధించి, యిందలి సాధకబాధకముల నచ్చజెప్పి, యికముందు వర్ణాశ్రమ ధర్మరతులును, స్వరాజ్యసంపాదనాసమర్థులును అగువారలనే, శాసనసభలకు సభ్యులగా బంపునట్లు ప్రబోధించవలయును.

స్వరాజ్య సంపాదనమునకై యేర్పడు నీసంస్థయు, నీమూల సూత్రమును మరువక, జాగరూకతతో బ్రవర్తించవలయునని హెచ్చరించవలయును.

ఇట్టి మహాసభ ప్రతి సంవత్సరము ఒక్కొక్కచోట జరుగుట అత్యావశ్యకము. అందులకు ఆస్తికులగు వారలందఱు యత్నించవలయునని ప్రార్థించుచున్నాడను ఇట్టి శ్రేయోదాయకమగు కార్యనిర్వహణమునకై ప్రతిజిల్లాయందు ఒక్కొక్క కార్యనిర్వాహకసంఘము నేర్పఱుప వలయును. ఈజిల్లాకు ఇప్పుడున్న ఆహ్వానసంఘమునే స్థిరమైన కార్యనిర్వాహక సంఘముగా నేర్పరచవలయును. ప్రతికార్యమునకు ద్రవ్య సహాయ మవసరము కనుక ఇట్టి మహాకార్యమునకు ఆస్తికజనులందరు ద్రవ్యసహాయము చేయవలయునని పునః పునః ప్రార్థించుచున్నాడను.

ఇట్టి విషయముల చర్చించుటకై యేర్పడిన సభ కధ్యక్షపద మధిరోహించుటకు కడుంగడు సమర్థులగు వారు కావలయును. ఆస్తిక శిఖామణులును, వైదిక లౌకికవిద్యా ప్రవీణులును, వర్ణాశ్రమ ధర్మానుష్ఠాన తత్పరులును, సభా కార్యనిర్వహణదక్షులును వాగ్మిత్రులును అగు ఉభయ శ్రీ ప్రభల లక్ష్మీనరసింహం పంతులు గారీ పదవిని దయతో నంగీకరించియున్నారు. వీరి వాఙ్మాధుర్యము సుధాప్రవాహ వేగమువలె నిరతిశయము. వీరు "ఆంధ్రసురేంద్రనాధ్ బేనర్జి" అని వీరికిగల ప్రసిద్ధిని యిపుడే మీరందరెరుగగలరు. కావున నెక్కువ మాటలచే నట్టిమధురవాక్ప్రవాహము నడ్డగించక, వారిని సభాకార్యక్రమము నుపక్రమింపుడని సవినయముగ బ్రార్థించుచున్నాడను. నేను సభామంటపములయందు ప్రజారంజకముగ మాటలాడ నభ్యసించినవాడనుగాను. అదియునుగాక, అవసర కార్యాంతర విక్షిప్తుడనై యుండుటచే, నీస్వాగతోపన్యాసమునకు తగినంత శ్రద్ధ నివ్వ లేకపోయితిని. అందుకు క్షమింతురుగాక.'

కవుతా సూర్యనారాయణరావు,

ఆహ్వాన సంఘాధ్యక్షుడు.

—(:o)—

# మహాభారత చరిత్రము.

గ్రంథకర్త - పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

శ్రీయుత పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మహాభారతచరిత్రమును ప్రచురించిరని వినిన దగ్గరనుండియు నాపొత్తమును చూడవలెనని యభిలషించుచుండ నొకనాఁ డాకస్మికముగా నొక మిత్రునివలన నాకాపుస్తకము లభించినది. పుస్తకము నామూలాగ్రమును శ్రద్ధతోఁ జదివితిని. శాస్త్రిగారి ప్రయత్న మగాధముగా గోచరించినది. మహాభారతమును, మహోద్దేశపూర్వకముగా తఱచి చూచినట్లు కనఁబడినది. కేవల చరిత్రకారునివలె నీగ్రంథమును వ్రాసియుండినచో గ్రంథమెంతయో వన్నెకెక్కి లోకోపయుక్తమై యుండెడిది. కాని శాస్త్రిగా రట్టియుద్దేశముతో వ్రాసినట్లు నాకుఁ గనఁబడలేదు. భారతమందును, భారతవీరులయందును కొంత నైరస్యభావము చదువరులకు జనింపఁజేయు తలంపుతో ప్రయత్నపూర్వకముగా నేవోకొన్ని స్వల్ప ధర్మలోపములు చూపి వ్యాసుఁడు, ధర్మజుఁడు, భీష్ముఁడు, ద్రోణుఁడు, మున్నగు భారతపురుషులయందును, సత్యవతి, కుంతి, ద్రౌపది, సుదేష్ణ మున్నగు భారత సతీమణులయందును కొంత అసహ్యమును కనుబరచి వీరిని నీచ పాత్రలుగా చిత్రింప సాహసించిరి.

భారత రచనాకాలమునకు మనుస్మృతి లోనగుస్మృతుల ప్రచారము కొంతవ్యాప్తిలోనున్నట్లు కనపట్టుచున్నను కురుపాండవులురాజ్యముచేయు కాలమునకు మనుస్మృతి వ్రాయఁబడినట్లుగాని ప్రచారములోనున్నట్లుగానినిర్ణయించు నాధారములెవ్వియు కానరావు. ఇటీవలఁ చరిత్రకారులవిమర్శమువలన స్మృతుల ప్రచారము క్రీ॥ శ॥ 300 లకు పైన నిర్ధారణ కాబడెను. కావున నాస్మృతులలోని ధర్మము లుదహరింపఁబడిన యీ పురాణాదులు వానికి పిమ్మటివై యుండవలెను. కావున

నీస్మృతులకు పూర్వ మెన్నో శతాబ్దములకు క్రిందట నుండిన కురు పాండవ పాంచాల, యాదవాదుల యాచారములు స్మృతిధర్మవిర హితములని చూపి వారినెల్లరిని సంకీర్ణజాతులుగను, ధర్మబాహ్యులు గను లెక్కించుట సాహసము. ... ... ...

మఱియొకవింత 'మహాయుద్ధము సంప్రాప్తమై యిక బాణము లను విడవఁబోవుచుండఁగా నర్జునునకు నారువందల యిరువది శ్లోక ముల నాశువుగాఁగవిత్వమును జెప్పి యుపదేశించెననుట యయుక్తము గానె కాన్పించును."—అని యొకచోట వ్రాసిరి. నిజముగా శాస్త్రి గారు యుద్ధమధ్యమున శ్లోకరూపముగా అర్జునునకు శ్రీకృష్ణుడు గీత నుపదేశించెనని యర్థముచేసికొనియే యిట్లు విమర్శించిరా? అట్లయినచో యుద్ధమధ్యమున యోధులెల్లరును నొండొరులతో శ్లోకరూపముననే సంభాషించుకొనిరని కూడ వీరు తలంచుచున్నారా? దీనివలననే శాస్త్రిగారెట్టియుద్దేశముతో నీచరిత్రను వ్రాసినదియు పాఠకులు తెలిసి కొనగలరు. వీరు వ్రాసిన మహాభారత చరిత్రమువలన చదువరులకు కొంత నిజమైన చరిత్రమును, జ్ఞానమును, భారత పురుషులయందు గౌరవ మును, కలుగఁ జేయుటకు మాఱుగా వారియందు నిరసనభావము కలుగుచున్నది. వీలైనప్పుడెల్ల హిందూమత గ్రంథములను, పురాణము లను, పురాణపురుషులను, నిందించుటయే పనిగా పెట్టుకొనిన క్రైస్త వాది మతబోధకులకు నీగ్రంథము కొంత సహాకారిగా నుండవచ్చును. ఈపుస్తకమును శాస్త్రిగారు టెక్స్టుబుక్సు కమిటీకి పంపినట్లో పంప నున్నట్లో నామిత్రునివలన నాకు తెలిసినది. ఈమహాభారత చరిత్రము లోని విషయములపై విపులముగా గొన్ని విమర్శములు వెలువడనున్నవి. పాఠకమహాశయులు వానిని విమర్శకదృష్టితో చూచి సిద్ధాంతము చేయువరకు Text-Book Committee వారు అజ్ఞానులగు బాలురకు పఠనీయగ్రంథముగా దీని నంగీకరింపకుండుదు గాక ని ప్రార్థించుచున్నాను.

శా॥ ఏరూపమ్మునులేని తేజమున కేదే నొండు రూపమ్ము వ్యా
హారార్థమ్ముగఁ గల్పనల్ సలుపు టర్హమ్మైనచో నెందు లో
కారాధ్యుల్ ధరణీసుపర్వు, లట నీ కైక్యమ్ము గల్పించినన్
ధీరుల్ మెత్తురుగాన నియ్యెడల సందేహింపఁ గామేశ్వరీ॥ ౪౮

శా॥ ఆయీశాంతులు నౌషధాదులును దానాదిక్రియల్ సర్వమున్
శ్రేయం బంద నిమిత్తమాత్రములు, నీ చిత్తమ్మురా "నన్నియున్
డాయున్ శ్రేయము" లంచు నేనెఱిఁగియున్ ధైర్యమ్ము నిల్పంగ తే
కాయీతంత్రములన్ మెలంగుట మదంబా ? ప్రోవు కామేశ్వరీ !

శా॥ నాచాపల్యము లెక్కసేయక యెటో నాబిడ్డనిఁ బ్రోచి నా
వాచాదోషములఁ క్షమించి కొమరున్ వర్ధిష్ణుఁ గావించి యీ
నీచశ్వాసరుజన్ హరించి జననీ ? నేఁడెల్లి విద్యార్థిగా
నేచందమ్మునో కృపన్ సలుపు జాగింకేల ? కామేశ్వరీ ॥ ౪౯

మ॥ ఇట ము న్నంబ ! భవత్కృపాకలన తా నీరీతిఁగాకున్కి ను
త్కటరోగాపనయప్రసక్తిమెయి విద్యాలబ్ధికై పొందు సం
కటపాశెల్లఁ దదార్తిపట్టునని నేఁ గైకొంచునున్నాఁడ, నిం
తటనైనన్ గొమరున్ గలార్థి సలుప న్నాకోర్కి కామేశ్వరీ॥ ౫౦

శా॥ ఆరోగ్యమ్మునుగూర్చి బిడ్డనికి నిత్యమ్మున్ బ్రియుత్నించుచే
సారె న్నాపని యయ్యె, నీకృప నిఁకన్ శ్వాసామయ మ్మిట్టులే
నీత్రైపోయినఁ బాఠశాలకు సుతు న్నేఁబంపికోనెంతు, నా
చారంబు న్నెఱవేర్ప నేనిఁ బితృదోషం బంద్రు కామేశ్వరీ ॥ ౫౧

శా॥ "శ్రేయస్సు ల్బహువిఘ్నముల్, బడు లెటో చేర్రాలు నేర్పు, నగలా
వ్యాయామమ్ములు దుర్లభమ్ములు భవత్పాదాబ్జసక్తిఁ గురు
స్థాయత్సత్కరుణావిశేషమునఁజూ ? ప్రాపించు విద్యాధనం
బోయమ్మా ? యటులూరకున్నఁ బిత నెట్లూహింతుఁ కామేశ్వరీ॥

శా॥ నీచేయంగలకార్య మంబ? కొమరు న్నీరోగుఁ గావించుటే
నాచేయంగలకార్యమో? కల కొంగి న్యత్నించుటే, పిమ్మటన్
వాచామాధురి లోనుగాఁగలుగుసౌభాగ్యంబు ప్రాక్సంచిత
ప్రాచుర్యమ్మున నబ్బు, నేరివశ మైశ్వర్యంబు కామేశ్వరీ॥ ౫౩

శా॥ ‘విద్యాలబ్ధి పురాకృతానుగతమై వేఱొక్కలా గెట్టులో
సద్యశ్శ్వాసరుజానివృత్తి’ యనుచున్ శంకింతువో? కర్మసం
పాద్యంబే సకలంబు, సత్య, మగుచో భక్తుల్ నినున్ వేఁడి ‘యా
పద్యోగమ్ములు వాసి’ రన్ననుడి కెవ్వాఁ డొప్పుఁ గామేశ్వరీ॥

శా॥ ఈపైఁ గొన్నిదినాలదన్క రుజ తా నేకొంచెమో నిల్వని
మ్మేపై మున్పటిరీతి కాఁదగదుసుమ్మీ? తల్లి? యట్లైనచో
నీపైఁజెప్పినపద్దెముల్ జగతిలో నింద్యమ్ములౌ, నాకు నీ
ప్రాపన్మాటయు మిథ్యయౌ, నెటేఁగి నన్ బాలింపు కామేశ్వరీ॥

శా॥ నీకారుణ్యము పుత్రుపైఁ గలిగనేనిన్ బ్రాగ్జనుస్సంచితా
స్తోకైనఃప్రకరప్రకల్పితరుజాదుర్దర్పముల్ దూరమై
సాకల్యమ్మున స్రుక్కు, నక్కతన నోశర్వాణి మద్వాణికి
న్నాకు న్నీకు యశంబు, బిడ్డనికి నానందంబు కామేశ్వరీ॥ ౫౬

శా॥ ఏ యామద్వయవేళకో నిశిని దా నీయామయ మ్మెప్పుడు
న్నాయాత్మోద్భవు నంటియున్నటులె కానన్వచ్చెడిన్ దల్లిరో?
సాయమ్ముం బొనరింపఁబూనినపు డీజాగేల? యీ దూరుజా
పాయమ్మున్ దుదముట్ట నెట్టి కొమరున్ బాలింపు కామేశ్వరీ॥

శా॥ అమ్మా? నమ్మిన నమ్మకున్న విను నాయాంతర్యమున్ దక్కరో
గమ్ముల్ కొండొక చిక్కువెట్టినను నీల్గన్ జేసినం గాని శ్వా
సమ్ముం గాసము నాయువుం బెనిచినన్ సాంతత్యముంజేసి క్రూ
రమ్ముల్, వీని నడంచి పుత్రుని గృపన్ రక్షింపు కామేశ్వరీ॥ ౫౮

శా॥ ఆయుర్వృద్ధికి "నుబ్బసమ్మ గుణు" తం చాయుఃకలావేదులం
దీయుద్దేశ మెసంగు నెల్లెడల, నీదృక్ఛ్వాసబాధాపరి
స్ఫాయద్దీర్ఘతరాయు వేమిఫల? మంబా? పుత్రిదీర్ఘాయువున్
శ్రీయుక్తంబు నరుగ్ణమున్ సలిపి నన్ జేపట్టు కామేశ్వరీ ॥ ౫౯

శా॥ అంబా? యుబ్బసమన్న దైవతముకా, దట్లయ్యు నాయుఃప్రదా
నంబుల్ సల్పెడినంట? నీవా? జగదానందైకసంధానదీ
క్షుం బాలించెడిమేటిదైవతమ పీచండాలరోగంపు రూ
పంబున్ మాపి కుమారునిన్ మనుపలేవా? సిగ్గు కామేశ్వరీ ॥

శా॥ 'ప్రారబ్ధ' మ్మనునట్టివాదమును నిన్ బాధింప దేమందువా?
ప్రారబ్ధక్షయమైనహేతువుననే పద్యమ్ములన్ జెప్పఁగా
నారంభించితినేమొ? నీవయి; నిజం బౌఁగాక కాకుండఁగా
కీరోగ మ్మెటులేని నీ వుడిపినస్లే యెంతుఁ గామేశ్వరీ ॥ ౬౧

మ॥ తిరుపత్యద్రిపతిన్ భజించుటలు నీదివ్యాంఘ్రిపూజల్ మహ
త్తరముల్ దక్కినతీర్థయాత్రలును 'వ్యర్థ' మ్మంచు లోనెంచదే?
నరలోకం, బౌక కర్మవాదమె జగన్నాథత్వముం బూనుచోఁ
బరిశీలింపుము పుత్రుఁబ్రోవుము రుజన్ భంజించి కామేశ్వరీ॥ ౬౨

శా॥ వేదాంతమ్ములఁ గర్మవాద మది యుర్విన్ సుప్రసిద్ధంబ, నీ
కాదుర్వాదముతోఁ బనే, మది యు నిన్నడ్డన్ సమర్థంబె? ని
న్నే దీనమ్మగ వేఁడికొంటి, సకల మ్మానేర్తు వీ వెట్టులో
నాదుర్యోగముఁ బాపు పుత్రి నరుజున్ గావించి కామేశ్వరీ ॥ ౬౩

శా॥ అంబా? నీదగుమాయలోనినిజ మావంతేనియున్ గానరా
మిం బూజ్యుల్ బుధు లిన్నిమార్గముల నెమ్మిన్ ద్రొక్కి, రీవన్నఁ ది
మ్మిం బమ్మిన్ మఱి బమ్మఁ దిమ్మగను బల్మిన్ మార్పఁగానేర్తు; శ
క్యంబే నీకఖిలంబు, పుత్రు నరుజున్ గావింపు కామేశ్వరీ ॥ ౬౪

శా॥ తల్లీ? యెల్లెడఁ గర్మవాదమె జయస్థానమ్ము గైకొన్న సం
పల్లాభమ్మున కై, జయాప్తికిఁ, గలాపారంపరీలబ్ధి, కా
పల్లీనత్వనివృత్తికిన్ జనులు నిన్ బ్రార్థించుటల్ వెఱ్ఱియాఁ
గల్లా నీ నిజసత్త, కానఁ గొమరుం గాపాడు కామేశ్వరీ ॥ ౬౫

శా॥ 'మానుంబిల్లియొ! మట్టిఁబిల్లియొ,' యగున్ మన్నించి మత్పుత్రకు
న్నినేర్పుంగతి నీరుజన్ సలుపుటే నిన్నేను బ్రార్థింతు, నీ
తో నాకేటికి శాస్త్రవాదములు, నాతో నీకుఁ బంతంబె? నా
పై నీకుం గలపేర్మిఁజూపి కొమరుం బాలింపు కామేశ్వరీ ॥ ౬౬

శా॥ 'ఆరోగ్యం బిడఁబూనె నంబ' యని నే నానందముం బొందఁగా
నారంభించితి, నంతలోన రుజ పూర్వాకారముం దాల్చె నేఁ,
డీరీతిన్ బలుసారు లయ్యె మును? పిడ్డే క్రొత్త గన్పట్టె? నీ
కారుణ్యమ్మది రాద యింతదనుకం గళ్యాణి? కామేశ్వరీ ॥ ౬౭

శా॥ ఏమందో యిసుమంత వాడు నెడఁ దా నీరీతి యారోగ్యమున్
సేమమ్ముం గనుపట్టి మీఁద నెపుడో చీకాకుగా మాఱుటల్
నేమంటే మును పీరుజానుగతికిన్; నేఁడేమి నీసత్కృపా
సామర్థ్యమ్మున నయ్యెఁ? నీకృపయె రా జాగయ్యెఁ గామేశ్వరీ॥౬౮

మ॥ కరి రక్షించినవిష్ణు వుండ, నల మార్కండేయు రక్షించుశం
కరుఁ డుండ, న్నిను దేవరించుకతమున్ గన్పట్టె 'మాయింటిదే
వర' వన్ సంగతి జ్ఞప్తిఁదెచ్చికొని నా బాలున్ గృపన్ జూచి యీ
గుటికన్ మాన్పఁగదమ్మ? యిష్టయిన జాగు న్మాని కామేశ్వరీ ॥

మ॥ ఇలువేల్పౌటనె శంకరాదుల మదిన్ వీక్షింప కీనిన్ను ని
చ్చలు వేధించుట గాదు 'తండ్రికరుణన్ సాధించుకన్నన్ గడున్
సులువౌఁ దల్లికృపన్ గడించు' టనియున్ జుమ్మంటిచో జాగిటుల్
సలుప న్యాయమె? బిడ్డపైఁ గృప నొగిన్ సాగింపు కామేశ్వరీ ॥

మ॥ ఇతరోపాయ మొకండు కల్గునెడ ని న్నెవ్వాఁడు వేధించు ? మ
త్సుతునారోగ్యముకోస మెన్నిగతులో శోధించి శోధించి పై
నితిక ర్తవ్యము 'నీపదాబ్జభజనంబే' యంచు లో నెంచి నిన్
బతిమాలన్ దొరఁకొంటి నాసుతు నొగిన్ బాలింపు కామేశ్వరీ ॥

మ॥ ఇలువేల్పౌనిను వీడి యేసురలనో యే నిప్డు వేఁడంగ, 'మీ
యిలువే ల్పుండఁగ మాకిదేటిగొడ' వం చేమందురో ? వారు, నా
కలుషమ్ముల్ హరియించి, నాకొమరుపైఁ గారుణ్యము న్నించి, మేల్
బల మారోగ్యము నీవ యీవలెఁజుమీ ? ప్రార్థింతుఁ గామేశ్వరీ ॥

మ॥ 'ఇలువే' ల్పంటకు నర్థమేమి? చెపు మోయీశాని? తన్ గొల్చు నే
స్తులఁ తన్ జెందకయుండఁజూచుటయుఁ దా నద్దాన నవ్వానిపూ
జలు గైకొంటయుఁగాక యన్యమగునే? శ్వాసామయం బూడ్చి ని
చ్చలు నాపుత్రుని బ్రోచి నాసలుపునర్చల్ గొమ్ము కామేశ్వరీ ॥

మ॥ 'నను వేధింపఁగఁబోకు మీరుజలకు న్నా కేమిసంబంధ మే
జనుకర్మ మ్మొటువంటి, దట్టిద రుజాసంసర్గమౌఁ, దత్క్షయ
మ్మున నారోగ్యము గల్గు' నంచనెదవేమో ? యట్టిదేమైన నే
నిను వీడన్, విడి నాయొనర్పుపనియున్ లేదంబ ? కామేశ్వరీ ॥

శా॥ "నీకన్నం బిడఁ బెద్దయొ"ట్టనుటయున్ "నేఁ డిందు నేఁడిందు"నం
చాఁకొన్నాతఁడుగూడ నొట్టిడుక తానచ్చోటనే మెక్కిన
ట్లీకర్జమ్మున బండయాచకుఁడనై యే నిన్ను నిర్జింతుఁ జూ
మ్మోకళ్యాణి ? సుతార్తిముక్తితెర వొం డూహింపు కామేశ్వరీ ॥

శా॥ "నీకుం బోవదు నాకుఁ బోవదు" వృథా నీకేల జాలంబు యీ
ఘ్నాకార్యంబు "పురస్కృతావమతి పశ్చాత్కృప్తమానం, బటం
చీకాలమ్మునఁ గాద, పూర్వయుగమం దెందున్ బ్రసిద్ధంబ యం
బా ! కాఠిన్య మిదేల ? బిడ్డనిఁగృపన్ బాలింపు కామేశ్వరీ ॥ ౨౬

శా॥ ఏకోశమ్మున నేనియున్ దయ లవంబే నున్న వేల్పెనిఁ దా
నేకొంతేనియు గర్భయాచకునిపై దృష్టి న్నిగుడ్చున్ ధ్రువం
బీకార్యమ్మున గర్భయాచకుఁడ, నా కిమ్మాశ్రిసితం బిప్పుడే
లేకున్న న్నిను వీడఁ, బుత్రుఁ డెటు తల్లి న్వీడుఁ గామేశ్వరీ॥ ౭౭

మ॥ గతి వేఱొక్కటి లేక పుత్రు నరుజన్ గావించు భారమ్ముఁ బూ
న్చితి నీపై; నటు నీకృపాగరిమ వానిన్ జేయుచో వాఁడు "పం
డితపుత్రుం" డనుదుర్యశంబు గన, కానిందోక్తి నాయందు సం
గతమై సద్యశ మబ్బఁజేయుసొబగున్ గల్పించుఁ గామేశ్వరీ॥ ౭౮

మ॥ అతిథుల్ వచ్చిన గారవింపనొ? యథార్హాంబుల్ నివర్తింపనో?
మతి నీపై భయభక్తిసంభ్రమము లేమాత్రమ్మునన్ లేవొ? దు
ర్గతులన్ జూచి విచారమందనొ? వృథాగా నేటి కోయమ్మ? నా
సుతు రుగ్ణుం బొనరించి నాహృదయమున్ శోధింతు కామేశ్వరీ॥

శా॥ నాయారోగ్యమునందు లోపశతమున్ గన్పట్టనీ నీకు నే
నాయాసం బిడి పీడగొల్పుటలు లే, దాత్మోద్భవుం గూర్చి యే
నే యాచించుట; వ్యాధి యొందనుక వాని న్నొంచు నందాఁక నీ
కీయాచ్నాపరిపీడ తప్ప దిఁక నీయిష్టంబు కామేశ్వరీ॥ ౮౦

శా॥ కాసశ్వాసలనైన సైఁచి నిలువంగావచ్చు నొక్కంట, యా
చ్నాసారస్యనిరాదృతిప్రచలదుచ్ఛ్వాసంబు సద్గోత్రజుం
డై సైరించినవాఁడు గన్పడఁడు, ని కంబా? యసద్గోత్రజా
భ్యాసం బేటికి? వేగ నాకొమరునిన్ బాలింపు కామేశ్వరీ॥ ౮౧

మ॥ నెలకేనిన్ మును రెండుమాసములకేనిన్ మూటికే నెడ్డా యీ
పిలికూఁతల్ విననై చికిత్సకతనన్ బీడించుటల్ మానుటల్
గల, దిఫ్డో ప్రతిరాత్రియున్ గనఁగనై కారింపఁగాఁజొచ్చె; ని
కలుషార్తిన్ హరియించి నాకొమరునిన్ గాపాడు కామేశ్వరీ॥

శా॥ అంబా ? యేఁబదివత్సరమ్ములవయ స్సాయెన్, సుఖంబుల్ దద
న్యంబుల్ ము న్ననుభూతముల్, నిజముగా నాజన్మనాం డిట్టిక
ష్టంబాకాలము చూడలేదు, సుతుఁ డీశ్వాసామయం బూడ్చి సౌ
ఖ్యంబు న్నా కిడనోపు, నయ్యది త్వదాయత్తంబు కామేశ్వరీ ॥

శా॥ నాకుట్టిన్ సుఖగా నొనర్చి యిటుపై నాకుట్టి కేకాక యీ
పాకమ్మున్ బగవానిబిడ్డకయినన్ వర్తింపనీ కమ్మ ? నే
నే కా దంబరొ ? నీవుగూడఁ గొమరుం డిట్లార్తుఁడే యైనచోఁ
గైకోలేవు సుఖంబు, నాకొమరునిం గాపాడు కామేశ్వరీ ॥ ౮౪

శా॥ దగ్గన్ సూచన యైన వెంటనె మదిం దాపోదయం బౌ, మఱి
న్నిగ్గుల్ దేరినమానసం బఖిలము న్నీరౌ, బిడాలధ్వనుల్
బిగ్గన్ దోఁచినఁ గోప ముప్పతిలు నోవిశ్వాంబ ? న న్నీగతిన్
సగ్గన్ జేయక పుత్రునిన్ మనిచి యాశ్వాసింపు కామేశ్వరీ ॥ ౮౫

మ॥ "ఇది యేమొ! పొనరించు" నంచు మదిలో నేమేని భీతిల్లి నీ
దుదయన్ వేఁడుటగాదుసూ ? జనని? మృత్యుప్రాపకం బిద్ది గా
దెదగున్ దీనికతాన నాయు, వగుఁగా కేలాభ? మీజీవనం;
బదయత్వమ్మ వహింప కార్తి నుడుపన్ యత్నింపు కామేశ్వరీ ॥

శా॥ సంగీతమ్మునయందు సాహితియెడన్ జాతుర్యమెల్లని య [త్రి]మే
బ్బంగా కంబరొ ? వాక్ప్రవాహ మెటు లుప్పొంగున్? రుజామా
యంగీకారము గాదు, శ్వాసరుజయో? యత్యంతశత్రువ్రజం
బుంగైకోఁదగ దీరుజఁ మలపు; మబ్బున్ హాయి కామేశ్వరీ॥ ౮౭

శా॥ విద్యాగోష్ఠికె కాద, యేపనికిఁ బుద్ధిన్ రోగి పాత్రుండు గాఁ
డుద్యచ్ఛ్వాసరుగార్తుఁ జెప్పవలెనే ? యోయమ్మ? నీకేల నా
పద్యంబుల్ మొఱవెట్టికోవలయు ? సర్వజ్ఞత్వ మున్నప్పు, డిం
కుద్యోగించి కుమారుని న్మనుచుచో ప్పాహింపు కామేశ్వరీ ॥

శా॥ నాయీ ప్రస్తుతదుస్థితిన్ గనినచో నాతల్లి ? సంతానమం
దేయజ్ఞుండును వాంఛఁబూనఁ, డిది యేమీ ? నీదయో ద్రేక మి
ట్లీఁయె న్నాయెడ, జీవితంబు తుద కిట్లా? నేను వేగించుటల్
"ఛీ"యన్పింపక వేగ నాకొమరుగాసిన్ మాన్పు కామేశ్వరీ ॥ ౮౯

శా॥ అంబా ? "మార్గమొకండు చిక్కె"నని నే నానందమున్ జెంది ప
ద్యంబు ల్నీపయిఁజెప్పి రోగతరణం బర్థించితిన్ మున్ను వి
ఘ్నంబున్ దానికి సంతరించి, తయినం గానిమ్ము వేఱొక్కమా
ర్గంబు న్నీవ యనుగ్రహించి కొమరున్ గాపాడు కామేశ్వరీ ॥ ౯౦

శా॥ ప్రత్యక్షమ్మయి దేవతల్ నొడువు టీపాపిష్ఠకాలమ్మునం
దత్యంతమ్ము నసంభవం బగుట స్వప్నాదిస్థితిన్ జెంది సా
మత్యంబూని సుతార్తివారణకు నంబా ! యొం డుపాయమ్ము మ
ద్భృత్యంతప్రవణమ్ముగా నొడువరాదే ? దేవి ? కామేశ్వరీ ॥ ౯౧

శా॥ చోటున్ మార్చిన "వ్యాధి తా సురుఁగు" నంచున్ వైద్యు లం
[ చుండి రీ
మాటన్ బట్టి చరింపుమందువా ? యొదేమం దీడనే వాడ నా
నాఁటన్ గల్గు నరుగ్ణభావ మనెదో ? నాతల్లి ? సూచించి యా
రాటంబుం దొలఁగించి బిడ్డనిఁ గృపన్ రక్షింపు కామేశ్వరీ ॥ ౯౨

శా॥ ఇచ్చోటన్ గల, వచ్చటన్ గలవు నీ వెచ్చోట లేకుంటి మ
మ్మిచ్చోనుంచి నిరామయత్వపద మీ విప్పింపలేవొక్కొ ? నీ
యిచ్చన్ సర్వము సిద్ధమౌ, నిది నిజం బీక్షింపు, మీవంక, కీ
యుచ్చైశ్చర్దారుజ బిడ్డనిన్ విడిచి యెందే డిందుఁ గామేశ్వరీ ॥

శా॥ ఆర్తుల్ లోనగువారు నిన్నడుగు టాయాకోర్కుల న్నీ వొగిన్
బూర్తిన్ జేయుట సుప్రసిద్ధమకదా ! పూజింతు నిన్ మత్కుమా
రార్తిన్ బాపఁగదమ్మ ! పీనికిఁ గలాభ్యాసావకాశంపు వి
స్ఫూర్తిన్ దేఁగదవమ్మ ? నీదుపదముల్ పూజింతుఁ గామేశ్వరీ ॥

శా॥ నైతే మూరి పయస్తరుస్థుఁడగుటం దర్శించి డెందంబునన్
భూతశ్రేణులమీఁది ప్రేమఁ దులసీభూజంబునుం జేరె శ్రీ
ఏతద్ధేతువుచేత ధూతమగు ఘోరైనస్సహస్రంబులన్
చాతుర్మాస్యమునందు భక్తిఁ దులసీసంసేవ గావించినన్. ౨౬౧

కం॥ గోవిందస్మరణము తులసీవనసేవనము క్షీరసేచన మెపుడున్
పావనచాతుర్మాస్యను సేవానికి దుర్లభంబు. లేమనవలయున్. ౨౬౨

ఆ॥ చెట్టుచుట్టుఁ బాదుచేసి యయ్యది నిండ నహరహంబు వలసినన్ని పరులు
నీళ్ళుపోసిపోసి నెమ్మిమైఁ బెంచెడివాని కులమె పూతమౌను బుడమి ౨౬3

కం॥ ఏవిధి నల తులసీద్రుమ తావలముగనున్నలక్ష్మి తా దినదినమున్
వే వృద్ధిఁబొందుఁ గ్రమముగ నావిధి ఫలియించు గేస్తు నాశాలతికల్. ౨౬౪

సీ॥ ఒకయమ్మ పెట్టె వేఱొకయమ్మ పెట్టలేదని కుందఁ డీక వర్ణి యాత్మలోన.
దారపుత్త్రాదులందఱి నెటుపోషింతునని యేడ్వఁ డీక గృహి మనమునందు.
కందమూలాదు లిందెందులే వెట్లని వందురఁ డీక నెద వననివాసి.
భిక్షు కెవ్వరు నేఁడు పిలువరై రట్లొకో యని పరివ్రాట్టింక నగడుపడఁడు.
ఎవ్వ రేపని చెప్ప రెట్లీదినంబు గడచునోకో యంచుఁ బ్రకృతులు మిడుకఁబోరు.
తులసిపూజను శ్రద్ధమై సలిపిరేని హరి హరించును రాకుండ నన్నివెతలు. ౨౬౫

కం॥ బహురసపరిభావితవిగ్రహుఁడయి హరి యొకఁడె యెల్లక్ష్మాజములందున్
గహిమించుచుండు నాతనిమహిమంబును బొగడఁదరమె మతిశాలులకున్. ౨౬౬

కం॥ స్మరియింపఁబడియె నిరతం బురుదుఃఖాదికము లంత మొందించెడి యిం
దిరయును దులసీనామకతరువరమునఁ దిరముగాను దా వసియించెన్. ౨౬౭

## —* బిల్వోత్పత్తి *—

ఆ॥ బిల్వపత్త్రమహాత్త్వంబు వేనికేని జెప్పశక్యంబుగానిది యెప్పటికిని
నిన్ను గుఱియించి యున్నదియున్నయట్టు లేను వచియింతు నాలింపు మింద్ర! యిఁకను!

తే॥ గట్లరాయనిపట్టి యొక్కటు విహారమాచరించి శ్రమంపడి యాస్యఫలక
మున జనించిన చెమ్మటబొట్టొకండు భూతలంబునఁ బడవైచి పోవుటయును

ఆ॥ మలలమిన్నయైన మందరమందు మొల్చినది యొక్కమ్రాను చెలువుగలిగి
వెండి యొకప్రొద్దటుమ విహరించుటకునుగా నరిగి గిరికుమారి యచటనచట

శా॥ తిరుగుచు నామ్రానుంగని కర మాశ్చర్యంబువొంది కడుఁ బ్రేయసులై
పరఁగెడి జయకును విజయకు ధరణీజాతంబుఁజూపి తగ నిట్లనియెన్. ౨౭౧

ఆ॥ "దివ్యమగుచు నడవి దీపించు నియ్యది యేమిచెట్టొ కాని యెఱుఁగఁబడదు.
కరము సుందరంబుగానుండి యెంతయు సంతసంబుగొలిపె సకియలార !" ౭౨౨

చం॥ అనియిటులుచ్చరించుటయు నందు జయాఖ్యసఖీవతంస మి
ట్లనియెను. "దేవి ! తావకముఖాబ్జగళచ్ఛ్రమవారిబిందుసం
జనితమ యీమహీజ. మఘసంక్షయకారి సమర్చనీయ మి
య్యనుపమమైనవృక్షమున కాఖ్య విధింపుము నీవు చెచ్చెరన్" ౭౨౩

మ॥ అనియిబ్బంగివచించుడున్ గిరిజ "యోయబ్జాక్షి ! యీవృక్ష ము
ర్విని భేదించి సముద్గతంబు. కనుకన్ బిల్వాఖ్య మిద్దానికిన్
జనుఁ. దత్పత్రము లాహరింప దొరయా. శ్రద్ధాయుతం బన్మద
ర్చనముంజేసినఁ గోరుకోర్కె యెదియున్ సంసిద్ధిగాంచుంజుమీ. ౭౨౪

ఉత్సాహము॥ బిల్వపత్రములనుజూచి ప్రీతి వానితోడ నన్
గొల్వఁదలఁచుమాత్ర ధనము గురియుచుందు వారికిన్.
చెల్వ మమరియున్న దాని చిగురు మెసవనెంచినన్
నిల్వ వఘసహస్రములును నిశ్చయముగఁ బ్రజలకున్ ౭౨౫

క॥ తల మారేడుదళాగ్రంబులతో నెవ్వాఁడు కలితముం జేసెడినో
బలువైన యామ్యయాతనవలని వెతలు కుడువఁబోఁడు వాఁడిఁక నెపుడున్" ౭౨౬

క౦॥ అనిపలికి పార్వతీదేవి నిజావాసంబుఁజేరె వేడుకతోడన్
వెను వెంట జయయు విజయయుఁ జనుదేర గణాన్వితముగ జంభవిభేదీ !

సీ॥ తన్మూలముననుండుఁ దగ గిరిజాదేవి. దాక్షాయణీదేవి దానిబోదె
తచ్ఛాఖలను మను దాను మహేశ్వరి పార్వతీదేవి తత్పత్రములను.
గాయల నలరారుఁ గాత్యాయనీదేవి పట్టి గౌరీదేవి భాసిలెడిని.
మధ్యవల్కలమున మఱియు నపర్ణయుఁ బుష్పంబులను దుర్గ పొలుపుగాంచు.
ఒప్పుశాఖాంగకంబుల నుమ క్రమముగఁ. బాణిరక్షణపొంటె రుద్రాణియాజ్ఞ
కాలు నవకోటిశక్తులు కంటకములఁ గాన బిల్వంబు శ్రేష్ఠంబు కలుషహరము

తే॥ పావనంబగు మారేడుపత్రములను జగముతల్లికిఁ బూజలు సల్పిరేని
ఏదికోరిన నయ్యదియెల్ల రూఢి నపుడ సిద్ధింపఁగలదు సహస్రనయన ! ౭౨౭

తే॥ అమ్మహేశ్వరి మోక్షదాయక విశుద్ధరూప గిరిజ పలాశభూరుహముఁజేరి
మనెడిశంకరు నీక్షించి తనదులీల నయ్యె శ్రీఫలరూప యేమందునింక॥ ౭౨౮

## —* పార్వతి విష్ణువును శపించుట. *—

మ॥ అని యిబ్బంగి వచించి స్పష్టముగ నయ్యాకాశవాకాఁగ నిం
ద్రునితోఁగూడి సమస్తదేవతలుఁ జాతుర్మాస్యరాఁ దచ్చతు

ఘ్నవృక్షంబుల కైక్యభావమున నర్ఘ్యంబిచ్చి పూజించి.
మనివాకుప్రీత్తును దన్మహావ్రతము కూడా! నీకు నే నియ్యెడన్. ౮౮౦

క॥ చాతుర్మాస్యము ముగియుడు దైతేయద్వేషణులకు దర్శనమిడి సం
ప్రీతిని హరిహరదేవుఁడు కాతరులైయున్న వారిఁగని యిట్లనియెన్. ౮౮౧

క॥ "మీ రిఁకఁ జనుఁడు మహావ్రతధారుల! దైత్యారు లఖిలదానవులను నే
మారిమసంగెద మీయధికారములను ననుభవింపఁగడఁగుఁడు ప్రీతిన్." ౮౮౨

ఆ॥ అని యిటుల్వచించి యట నేకరూపులు నరిహరులును నైన హరిహరులు గ
ణంబులకును దివిజనాథులకును భేదబుద్ధి తొలఁగఁజేసి పుచ్చుటయును. ౮౮౩

క॥ ఆ తెఱఁగుల్ల విమానవ్రాతముపై నరిగి భేదవాదంబులు వో
ధూతాసురకృతబాధత స్వాతంత్ర్యంబునువహించి సౌఖ్యంపడుచున్ ౮౮౪

తే॥ పార్వతీశాపముననైన భయముతోడఁ దన్మహేశ్వరి బిల్వపత్రములతోడ
బట్టుపూజించి నుతిసేయఁ బ్రీతయగుచు నెంతయుం గృప నాదేవి యిట్టులనియె.

తే॥ "నాదుశాపంబు వ్యర్థంబుగా దయినను మీరు శిలలయియుండురు మేదిని. దివి
నొదవ దది పూలనమ్మినయూరిలోనఁ గట్టెలమ్మినచందంబు గాకయుండ.

మ॥ నరలోకంబున రాతివిగ్రహముల నాశ్రయించు చెల్లప్పుడున్
గన మర్చించెడివారికిన్ వరదులై ఖ్యాతిన్ సమార్జింతురు రం
దఱుఁ బాణిగ్రహణంబునన్ విహితులౌ తత్తత్కుమారాళికిన్
సురలారా! ప్రజలొచ్చువతిన్ లెద రచ్చోటం గుమార్యాళికిన్." ౮౮౫

మ॥ అని యిబ్భంగి ననుగ్రహించుటయు సర్వాసుర్త్యులుం దద్భయం
బున నష్టాత్మత భక్తవాంఛితములం బూరించుకొం చర్చలన్
మని రింకం గనిదీర్ఘ కంబిక రమానాథున్ స్వనాథుం గనుం
గొని పల్కెన్ స్ఫురితాధరోష్ఠయగుచుం గోపంబుతో నిట్లనున్. ౮౮౬

స్రగ్విణి॥ "రమేశా! నీవైనం దగదిదియనన్ రాదె శివుతో.
కుమార్గుండై. తా హేతువున శిలవై యుండుదు విఁకన్.
తమిస్రారాట్చూడుండును నుపలమౌ ధాత్ర్యమరశా
పమే లింగాకారంబగుటకయి పూర్వంబ మనుటన్." ౮౮౭

తే॥ అనినవిని విష్ణుభగవానుఁడమ్మహేశిఁ బార్వతీదేవి ననుకూలపఱచుకొనుచు
క్షోణితలమున నెన్నొసలు సోక మ్రొక్కి యెంతయును స్తోత్రపూర్వకమిట్టులనియె.

సీ॥ "సతము మహాదేవు సఖివై మహావ్రతదీక్షఁబూనిన మహాదేవివీవు.
సత్త్వరజోగుణసంస్థాయినివియైన సత్త్వతామసీశక్తి వీవు.
మాతాత్రితయంబున మహితవై యుండెడి ఘనగుణత్రయవిభావినివి నీవు.
అఖిలజగద్వ్యాపకాద్భుతరూపవౌ మాయాదికంబుల మాతవీవు.

సర్వరూపవగుచు జనులకు సంతతిచ్చు రూపసాధ్యవౌ నరూపవీవు.
ఆగమముల మాట నభినుతమైన యోంకారమీవు కావె క్రతుభుగీశ! ౮౯౧
తే॥ లీల ఫలవేళ్లలో మహాకాళివియును లలి సరస్వతివియు మహాలక్ష్మివియును
నీవయౌదు. వషట్కారమీవె. మఱియు రాగిణివినీవయౌదు. విరాగిణివియు
ఆ॥ భూతధాత్రి! నీవు జ్యోత. శుభా! నీవు నతి. విరాగిణీ! ప్రణామమిదిగో.
శివ! జోహారునీకు చేకొన వికరాళి! మత్కృతంబులౌ నమస్కృతులను" ౮౯౩
క॥ అనియిట్లు స్తుతించుటయును మనమున సంతోషమొంది మహీభృత్సూత్రి
ట్టనుభవ పరమోదారంబును మిథ్యారోపసహితమును నగు నుడులన్. ౮౯౪
ఆ॥ "నాదురూప మోజనార్దన! తిరుగదు నీయెడలనుగూడ నిక్కువంబు
ఊర్వినైన నీవు యోగీశ్వరులకుఁ గైవల్యదాయివగుచు వఱలెదవు. ౮౯౫
క॥ భక్తులకోరకులొసఁగుచు వ్యక్తుఁడవయిరయే వసింతు వైకుంఠా! యీ
ఉక్తార్థంబునఁ దావకశక్తి మఱింతయాయియుండుఁ జాతుర్మాస్యన్ ౮౯౬
సీ॥ అంభోజసంభవు నను శంఖుంగొమార్తయై జనియించె నేయమ జగములోన
ఏయమ యగ్గలం బింపైనరాళుల సారంబునుండి తా నేరుపడియె
స్వపయఃప్రవాహానుస్నాతుల కేయమ శ్రేయఃప్రదాత్రియై చెలువు గాంచు
తరుగని మధురపాథస్సులతో నిండి యేయమ రహిఁ బ్రవహించుచుండు
అట్టిగండకినది స్వచ్ఛమైననీట నయ్యెడిని నీనివాస మింకియ్యకొనుము.
ప్రీతి నిరువదినాలుగుభేదములను గాంచుచుండు పురాణజ్ఞు లెంచిరన్న. ౮౯౭
సీ॥ బంగారవర్ణాస్యంబునం గల్గి బుధులచే నవని సాలగ్రామ మనఁగఁబడెదు.
తేజంపుముద్దవై దీప్తివహించుచు వర్తులాకృతితోడ వఱలెదవు
సర్వసామర్థ్యంబు సంగతంబైయుండ శ్రీసమేతుండవై చెలఁగఁగలవు.
ఉత్తమోత్తములైన యోగులకుంగూడ మోక్షప్రదాతవై మఱియఁగలవు
వేయిమాటలేల విష్ణూ! శిలాగతుండైనయట్టి నీ కనూనభక్తి
సేవఁజేయుజనులు చింతించినదియెల్ల నొసఁగఁగలవు కరుణ నుర్వినీవు
క॥ శిలయందలరారెడి నినుఁ దులసీదళములను భక్తితోఁ బూజింపం
గలయట్టిమనుజులకు దవ్వులనుండదు మోక్షలక్ష్మి బూచులగొంగా! ౮౯౯
క॥ చక్రాంకితసర్వాంగ మవక్రంబును నైనశిలను వఱలు నిను నో
చక్రీ! సందర్శించిన యాక్రూరుఁడుగూడఁ జనఁడు యమునింటికిఁకన్" ౯౦౦
క॥ అనివాక్రుచ్చెను నుమ యీయనువున. భగవానుఁడైన హరి యుపలత్వం
బెనసినవాఁడు. వచించితి ఘనసాలగ్రామమునకుఁ గల కారణమున్. ౯౦౧
క॥ గోవిందుండు మహాశాపావృతుఁడై చనియెఁ దనదు నాలయమునకున్.
గ్రావాత్మజాతయు మహాదేవుని శపియించి ప్రణతిఁ దృప్తియుఁ బెట్టెన్.
తే॥ అట్లు భవభూతభవ్యభూతాదికృత్తు నఖిలసంస్థితినాశాంకుఁ డవ్విధుండె.
కమలతోఁగూడి యతఁడును గౌరిఁగూడి శంకరుండును నాల్గువృక్షముల మనిరి.

౯ గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసర్కిలిన్‌స్పెక్టరు, నర్సారావుపేట.

౧౦ నారాయణరావుగారు, దాతారుపల్లె

౧౧ గంగరాజు గోపాలకిషన్‌రావు దేశముఖుగారు-పాపురం.

౧౨ జూలూరి వెంకటరత్నంపంతులుగారు, గుంటూరు

౧౩ భాస్కరరాయుని వెంకటరామయ్యగారు, వంగపల్లి

౧౪ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ

౧౫ చేలూరి రామన్నగుప్తగారు, సదాశివునిపేట

౧౬ రామూరి సుబ్బయ్యగారు - శ్రీ శ్రీ విరూపాక్షసంస్థాన ప్రధానమంత్రి

౧౭ ఘంటంగట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురం

౧౮ తిగుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు - ముసలాపురం

౧౯ కప్పగంతు సుబ్బారావుగారు - పోలీసుసబిన్‌స్పెక్టరు - కొమ్మాలపాడు.

౨౦ గంగావజ్ఝల గంగయ్యగారు, నర్సారావుపేట

౨౧ శ్యామాపంతుల గోపాలరావుగారు - హైదరాబాద్.

౨౨ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యుల అయ్యవార్లంగారు - కొత్తాపురం.

౨౩ కన్నయ్యగారిసంగయ్యగారు-ముసలాపురం

౨౪ తాళ్ళవలస లింగన్న ముకద్దంగారు-గడిపెద్దాపురం

౨౫ కిషన్‌రావు దేశపాండ్యాగారు తాళ్ళపల్లి

౨౬ వెంకటరాజయ్య, మస్తేదారు గారు - సీతారాంపురం

౨౭ సుబ్బారెడ్డి దేశముఖుగారు, శృంగసాగరం.

౨౮ ఊంటుపల్లి రామారావుగారు, సంగెం

౨౯ చిప్పగుల శ్రీరామశర్మగారు- నాగులుప్పలపాడు

౩౦ రాయచూరి బండేరావుగారు, అయినాపురం.

౩౧ గజవాడ వెంకటాచార్యులుగారు, అల్లాదుర్గము

౩౨ కొండంభట్లగారి వెంకన్నగారు. గుమ్మడిదల

౩౩ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి దేశముఖుగార్లు-నారాయణపురం

౩౪ చెన్నూరి నరసింహారావు దేశపాండ్యాగారు-[illegible]

౩౫ కందాళం కేశవాచార్యులుగారు-కిచ్చన్నపల్లె.

౩౬ ఊంటుపల్లి అమృతరావుగారు-సంగెం.

౩౭ మాణిక్యంగారి బాలచంద్రయ్యగారు-హైదరాబాద.

౩౮ చేకులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.

# అభినవసరస్వతి

సంపాదకుడు - నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు

జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును ప్రకటింపబడును. చందా సం॥ 1 కి రు 3—0—0

## ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | కరిణీకోద్ధారిణి [పూరె వీరభద్రకవి] | ... | 0 | 4 | 0 |
| 2 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 3 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | | 0 | 4 | 0 |
| 4 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 5 | నీతిగీతులు (సుమతిశతకమునకు సంస్కృతము) | ... | 0 | 2 | 0 |
| 6 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 7 | విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 8 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) | ... | 0 | 4 | 0 |
| 9 | సంగదోషము | ... | 0 | 3 | 0 |
| 10 | అస్పృశ్యతానివారణ ఖండనము(మల్లాది రామకృష్ణ చయనులు గారు) | | 0 | 8 | 0 |
| 11 | వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 12 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివెంకటీయము) | | 0 | 8 | 0 |
| 13 | పశ్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 14 | పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 15 | శంతనురాజచరిత్ర | ... | 0 | 14 | 0 |
| 16 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 17 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 18 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 19 | అభినవశాకుంతల నాటకము | ... | 0 | 8 | 0 |
| 20 | సూతసంహిత-ఆంధ్రము | ... | 2 | 0 | 0 |
| 21 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము ( ౧ సంపుటము ) | | 1 | 0 | 0 |
| 22 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| 23 | డిటో నాగరఖండము (3 సంపుటము) | | 1 | 8 | 0 |
| 24 | భారతీయప్రబోధము (పిడుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |
| 25 | ధర్మనిర్ణయము. | | 0 | 4 | 0 |
| 26 | భారతకథాతత్త్వనిర్ణయము(మల్లాదిరామకృష్ణవిద్వచ్ఛయనులుగారు) | | 0 | 4 | 0 |

అభినవసరస్వతీకార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,

గుంటూరు జిల్లా.